# Menaka Kousika
# SAMVADAM.

మేనకా కౌశిక సంవాదము.

BY

K. VEERAMALLIAH PANTULU,

OF BEZWADA.

SECOND EDITION (Revised). 1000 COPIES

PRINTED BY D. K. PANT, AT VANI PRESS.

BEZWADA

1910

బనిపినవాఁడు గల్గిన వి
వాదము దీన నెఱుంగఁగానగున్.

మేనక-మ. రమణీవ్యూహముతోఁడ సంతతము
నారామస్థసౌధంబులన్
గమనీయోక్తులఁ గాలయాపనమునుం
గాంక్షించురాజన్యవం
శమునుంబోవిడి కందమూలఫల ని
స్సారాన్నముండుంచు సం
యమివై యొంటిగనుంటి గాధిసుత సౌ
ఖ్యంబింతగానేర్తువే.

కౌశికుఁడు-మ. పటుసౌఖ్యప్రదమంచుఁ రాజ్యధర గ
ర్వప్రాభవంబంది ముం
గిట నేమున్నదొ కానలేక ప్రజలన్
గ్రేగంటవీక్షించి దు
ర్ఘటకృత్యంబులు సేసి కాలుపురిఁ జే
రంబోవుటల్ కన్న ధూ
ర్జటిసేవించు మునీంద్రవర్తనమునన్
సౌఖ్యోదయంబుండదే.

మేన-చ. అధిగతమానివృత్తి తొలి
యందునవున్న వరే, నితంబినీ
యధరము గొంతకాలమటు
లాని హఠాత్తుగ వ్రతంబు నీ

విధవమున ఘోరదీక్ష నట్టి
వీస్థలిసల్పిన నేమిలాభమిా
విధవిడనాడినప్పు డలి
వేణులు జ్ఞప్తికిరాకయుందురే.

కాశి- చ. భరమగుదీక్షచే నెపుడ
నార్యముగాఁగఁ దపస్సమాధిలో
గురుపదభక్తినిన్నిలిపి
కూర్చునియుండిన తుచ్ఛమైన సుం
దరులప్రశంసయెక్కరణి
జ్ఞప్తికివచ్చును కీనిశక్తిసీ
వెఱుఁగమినిట్టులాడితి, వు
మేసునిచింత కివన్నిలొచ్చగు౯.

మన. చ. చెలులప్రశంస తుచ్ఛమని
చెప్పితి వయ్యది లేకయున్న చో
నిలుచున లోకజాలములు
నీరజనేత్రుఁడు బ్రహ్మ శంకరుం
డలికులవేణుల౯ హృదయ
మందున మోమున దేహమందున౯
నెలవులొనంగి యుంచుటని
నింద్యమనంగలరే నరోత్తముల్.

కాశి- చ. తరుణి వృథాప్రసంగమునఁ
దద్దయుఁ గాలముఁబుచ్చనేల నీ

వరుగుము స్వాంతకార్యముల
నన్నిటిఁబీడి యిటులవచ్చితో
యెఱుఁగఁగఁజెప్పు మేదయిన
నీవలెనన్న నొసంగిపంపెదర్
సరసిజపత్రనేత్ర యిఁకఁ
జయ్యనఁబోవలెఁ దానమాడఁగర్.

మేన- మ. మునివంశోత్తమ! మీ యనుగ్రహమునన్
బొందంగరానట్టి మెం
దును లే వియ్యది నిశ్చయంబనుచు నే
నున్నేర్తు మీదివ్య ద
ర్శనముల్ సేసెడి భాగ్యమబ్బుట మహా
సామ్రాజ్యముల్ గూనుటో
యనఘాత్మా! మముబోంట్లనాదరము
సేయుంజూచు టాశ్చర్యమే.

కాశి- తే.గీ. స్తోత్రపాఠంబు లేటికి సుదతినీవు
వచ్చియున్నట్టి కార్యంబు వ్యక్తపఱచు
మవలనియమితకాలంబు మిపులకుండ
జరుగవలెసుమ్ము నిలువ బుణ్యమ్ము నమ్ము.

మేన- మ. యతిచూడామణి! మాకులంపు చెలుల
న్యప్రార్థనల్ సేతురే
కుతుకంబొప్పఁగఁగోరు పూరుషులునా
కుంలభ్యమౌఁగొందునా

ప్రతదీక్షా ఫల మబ్బునట్లు లోనగూ
ర్చక రెండు నాయావనం
బతి తేజంబుగవృద్ధిఁ జెందుటయు మూ
డర్పించి మన్నింపవే

కాశి- తే.గీ ఇచ్చినాఁడనుగోనుము నీ యిష్టమైన
మూఁడువరములుఫలియించు ముదితనీకు
ప్రీతిఁజెందుముపొమ్ము నీ ప్రియులకడకు
నాకుఁదడవయ్యె పోదు స్నానంబుసేయ.

మన- ఉ పోవుటయెట్లు నావరముఁ
బూర్తియొనర్పక నేను నీపదర్శ
భావమునించియుంటి ఫల
వంతము సేయుము నాదుకోర్కె
మీవరశక్తిచేత నిది
మీకునుదప్పదు మానివర్య నేఁ
డావక పాదపద్మములఁ
దద్దయుఁగొల్చెద నాదరింపవే

కాశి- తే. గీ. అకట సంసారమునుమాని యడవులందుఁ
దపమువల్పెడుమాయట్టి తాపసులను
గర్వ్యాకృత్యంబుసేయఁగాఁ గడఁగుమనుచుఁ
గోరుటొప్పున నీయట్టి ధీరమతులు.

మేన- చ. పదుగురుమెచ్చునట్లుఁ బరి
పాలనఁ జేసి శశాంకబింబముఁ
జిదిమెదుమోముఁ గల్గి నృప
శేఖరవంశమునందుఁ బుట్టి న
మ్మదినలరించు యౌవనము
మానుఁగఁ గల్గిన మిమ్ముఁ గూడి న
మ్ముదమును జెందుకొంట మము
లొంట్లకుఁ గొండొక సౌఖ్యముండునే.

కాశి- ఉ. ఓసి వెడంగ! నీయెడ న
య్యోచితవృత్తివరంబులిచ్చిరే
వీసముగాని పెద్దయని
పిన్నయటంచును నెంచకుండఁ జే
రావవహించు నక్కగతి
నైతివి నేమను జేలనైరి భ
క్తాసురు మెచ్చి వాంఛితము
లర్పణ నేసిన యాశుకైవడిన్.

మేన- తే.గీ. చావువిషయంబువారిది సౌఖ్యవిషయ
మిదియ దీనికిదాని కేదేదసామ్య
మకట చాలు మిటారీటు లిట్లనుటలగున
తగవు సేతురె ముక్తికాంతను వరింప.

కాశి- తే.గీ. ముక్తికిని వారకాంతల పొందునకును
సామ్యముండున వేదాంతసారముల్లఁ

దెలిసినట్టులసె ప్పెదు త్రిప్పుకొనుచు
మానుమీాపాటిమాటలు చానయింకను.

మేన- తే. గీ. జన్మరాహిత్యమైనచోఁ దన్మయంబు
గతినిస్వర్గపార్శ్వంబుల రతులఁదేలఁ
దగిన సురవారకాంత భూతలమునందు
గలుగుకంటెనునాము క్రి కాంతయెండె

కౌశి- మ. పరమార్థంగని చిక్కఁబట్టి హరసే
వారక్తికాలంబునన్
జరపన్ దన్మయమానుగాని కమతు
చ్ఛంబై నవంచేంద్రియా
ధ్వంతన్ బాయఁగ స్వర్గభామినుల పొం
దున్ గాంచుమాత్రంబునన్
స్థిరసౌఖ్యంబని యెంచనానాకా సదా
జీవైక్యమేలేనిచోన్.

మేన- క. వేశ్యావిటులాశైక్యము
వశ్యముగాఁజేసికొనిన వట్లనన్నే హా
వశ్యకరకలుగునాకేటు
కాశ్యపికూటంబుగలుగు గాశిక చెప్పమా.

కాశి- తే గీ. దేవవేశ్యవుగానపూ త్రిదివమందు

కామినీజనసాంగత్య గరిమ గున్న
నుభయులో భ్రష్టుఁడగుదుమ్మి యువిదపొమ్మి.

మేన- మ॥ మునిలోకంబున మీవశిష్టుఁడును నా
మున్నైనవారందఱున్
వనితాసంగతిగల్గియుండరొకో, యు
ష్మాదృష్టప్రాచీను లీ
వన నేనెన్నటివాఁడవౌదు నిజమే
యామానులంబోలె నీ
వును శక్తుండవయేని జంకుకువె నే
బోధింతు మింపంగదే.

కౌశి- తే.గీ. నీ! వసిష్ఠుఁడుమాత్రంబు దేవసముఁడె
నేను నతనికి నొచ్చుగా నింతినిమ్ము
గలిసి నీకోర్కెదీర్చెద గఠుము తపము
విఘ్నమొందిన మఱలఁగావింతుగొంత

మేన- ఉ॥ పాపము మీతపంబునకు
భంగముసేయఁగనేల? మీకు సం
తాపమునొందనేల? ననుఁ
దద్దయు వంతముచేతఁగూడి మీ
కోపముతీరు వెన్క- మఱి
కొంత తపంబొనరింపనేల? నా
శాపటీకచే మరల
స్వాంతమునీమీపయి నుంచనేలనోఁ.

కా- తే గీ. అతివ ! నీకు సద్యోగర్భమమరఁ జేసు
సఖిలసౌభాగ్యములుకూడ నొసఁగినాను
మదిని వేఱొండు తలఁపు నేమరుముసుమ్ము
రమ్ము సౌదామినీవల్లి రతులవెల్లి.

మేన- క. దేవా! నాపైసదయా
భావమునుంజూపినన్ను బంపుమునాకై
దేవవిభుం డటగనలం
బోవునుయేమో భయంబు పొడముచునుండెన్

కాశి- చ. వెలఁది భయంబునొందకు త్రి
విష్టపమంతియు నానవెట్టెదన్
జలమున దేవనాథుఁడు వి
శాంపతిమానిని నన్నుఁగూడు నిన్
జులకనసేయఁగాఁగలఁడె
సుందరి నీ కభయంబునిత్తు నెం
దులకిఁక జాగుసేయఁ బరి
తోషముతోఁడఁ గవుంగలింపవే.

మేన- తే. గీ. జ్ఞానసంయుక్తులైనట్టి మానవులకు
గర్హ్యమైనట్టి పశుసమాగమముగాని
బట్టబయటను బలవంతపెట్టఁదగున
ఇంద్రియోన్మాదమడఁచు మీరాకిద్ధిఘనము.

కౌశి- మ. జలజాక్షీ ! మునుముందు త్వన్మృదువచ
స్సంలబ్ధదోశ్శక్తిచే
లలినీచూపులతూపులఁ బరపి శ్రీ
లం జెల్ల సాంతంబుగా
జలధిఁ ద్రోయ మునింగిరిఁ గుచగిరుల్
సంధించి పైకెత్తి త్వ
ద్బలదజ్ఞాక్షీ ముఖేందుయోజనముచేఁ
సౌఖ్యాబ్ధిఁ దేలింపవే.

మేన- తే గీ. మీయనుజ్ఞకు వేఱొండు సెప్పఁగలని
యార్య ! నేఁగోనవును ప్రత్యక్షమగుచు
నామకోర్కెలుదీర్పఁగ మోదమంది
వరముసంగుము పొదరింటిదరికిరమ్ము.

కౌశి- తే గీ. అదియుకాకున్న నాప్రాణమైననిత్తు
సంశయింపఁగనేలరో సకియవినుము
సేద్యగానికి నాగంటిసిడముబట్ట
బరువులోఁచూ రారమ్ము పదలిమున్న.

మేన- తే.గీ. దేవ! యీపూవుటీరంబు దివ్యభవన
మునకుసరిపోలు సుమనసపూతమగుట
ఘనతరామోదమున భవత్కరయుగంబు
పల్లవముగఁ జేయు మీకౌఁతలమునకును.

కాశి.-మ. వనితా! నాదుపురాకృతంబున, లస
ద్వ్యాకుర్వాంతంబై, మనో
జనితోత్సాహనివాసమై, మనసిజా
స్త్రప్రాపకంబై, సుధా
ఖనియై, యొప్పుత్వదోష్ఠపానమున సౌ
ఖ్యంబందితిన్ నిన్నునీ
తనుజాతన్ గాని దేవలోకమున ని
త్యశ్రేయముల్ గాంచుమీ.

మేన. మ. అనఘా! మీకరుణాప్రభావ జనితం
బైనట్టి యీకన్యకన్
ఘనసమ్మోదముతోడ బెంచుకొను మా
గాంభీర్య విచారించుమీ
మునివంశాంబుధిచంద్ర! స్వర్గమునకుం
బోవంగ నాలస్య మ
య్యెను నాకావతి నిమ్ము పోయెదను దే
వేంద్రాజ్ఞ గావింపగన్.

కాశి. తే.గీ. అడవులంబడి యొంటిసహార్షికమును
దపమునల్పెదు నాబోటి తాపసులకు
పిల్లలను పోషణము సేయ వీలుపడునె
నీవ పాలముఖ్యము నేసి నిమువు నట్లో.

మేన- తే.గీ. ఎవరుపిలిచిన న్వచ్ఛోటికేగుచుండు
అంతరాశ్రద్రకు పిల్లలయంకిలేకిఁగి
సాకుటన్ననునేరీతి సాధ్యమగును
నీవసాకుము శ్రమచేసి నినువు నెటులొ.

కౌశి- ఉ. స్త్రవ్యముఁ నేడఁ దెత్తుఁబరి
ధానము లేగతిఁ దెత్తునీ పెనీ
వన్యమృగాళి మధ్యమునఁ
బాలవమేగతి సేయనేతుఁ సా
మాన్యమె పిల్లకాయలకు
మజ్జనముల్ పచరించుటన్న నీ
కన్యను నీవసాకవలెఁ
గాకెటునావశమాను గోమలీ.

మేన- తే.గీ. పుట్టుపిల్లలనందఱిఁ బోషణంబు
సేయుభారంబునామీఁదఁ జేర్చుకొన్న
నిల్లుపట్టున నేనేడయీాదు ఓడ
యొందజాటులనద్యోగర్భ మిచ్చువారు.

కౌశి- తే.గీ. పిల్లలను పెంచు భారంబు తల్లులగుచు
నుండవలసినదే కాని మోరులకెట్టు
సాధ్యమగునిట్టి కార్యంబు జలజవదన
నేనుబూనఁగఁజాలనే మేనిదైన.

మేన- చ. పనివడి నింబట్టి కార్యమున్
బైనిదుకోసము మానిచంద్ర? జ
వ్యసులను మోసగించితిరి
ప్రప్రథమంబునఁ జెప్పకుండఁ గా
పనుగొని పొమ్మటంచనుట
పాడియె? యోఋషివర్య! నేనిదే
చనియెదఁదీసికొమ్మనిగొ
చయ్యనఁ జేరికి బాలికామణిన్.

కౌశి- చ. వరములనిచ్చువేళ నిది
వద్దనిచెప్పక సంతసించి యి
త్తఱినిటు లడ్డగిడ్డములఁ
దద్దయుఁ జెప్పుట నీకుఁ జెల్లునే
వెఱవకు కన్యకామణిని
బెంచినపుణ్యము నీకుదక్కు నె
మ్మగి మరసేయకుండ విన
యమ్ముగఁబొమ్ము రయమ్మునన్ జెలీ.

మేన- తే.గీ. అకటనిష్ఠురపెట్టెద వయ్య నన్నుఁ
గాలవంకీయగు బాలికనుభరింప
జాలమియుంపు మఖిలంబు సంయమీంద్ర
యెఱిఁగియుండియు నిటుసెప్పవతనమగునె.

కౌశి- క. ఏనేమి సేయువాఁడను
దానా! యీచంటిబిడ్డ సాకుటయగునా

మానుల వర్తనమెఱుఁగవె
ఏనాఁడో కన్ను తెరతు రేనిటు పెంతుర్.

మేన. చ. ఋషివయినీవు వేశ్యనుఁ
గొనునుగూఁతుటచేత నిగరిన్
విషమపరీక్ష వచ్చెవిధి
నెంగిలి కాకిటువంటి పుత్రికన్
గృషియొనరింపలేని గుణ
హీనులకిచ్చునె? కాసిలెండికన్
కపభిమతేల దీనిఁగాని
చంపిన స్వర్గసుఖంబులందెదర్.

కాశి- తే. గీ. అన్న యొంతటిమాట నీవంటివబల
చాలుశిశుహత్యయొనరించు జనులకెవ్వరు
ఘోరనరకంబు ప్రాప్తించుఁ గొండొకప్పు
డైనముక్తియే కలుగదుమానిజమ్ము.

మేన- మ. నరకంబో త్రిదివంబొ యెవ్వరెఱుఁగుర్
వర్తించ రాచారముల్
గరిమారాధనసేసి పీడుటయకా
కజ్జంబు లేకున్నని
ర్వ్యాగకుంబట్టని బిడ్డ సేమగును నీ
పుస్తైనునుంగూడ న
త్యారమే చేతము చేతియాడుగనెపా
పంబింతగాఁ బండుటల్.

కాశి- తే.గీ. కడుపునందుద్భవించిన గాదిలిసుతఁ
జంపఁగాఁ జేతులెట్లాడు సారసాక్షి
యిట్టికృత్యంబు మనకేల పట్టవలసెఁ
గామమననిందుచేత నే గర్హితంబు.

మీన- క. వెనుకయు ముందునుఁ జూడక
చనుదెంచిన దానికిట్లు సంభవ మయ్యెన్
మనమునఁ జింతించినమా
త్రనఁదీరున నిశ్చయించు తాపస ముఖ్యా.

కాశి- తే.గీ. సుదతి యేమైనసీవ పెంచుముకుమారిఁ
జంపుమనిసెప్పఁగా నోరుసాగకుండె
నేనునష్టప్పకనుగొందు నసువునేను
నాల్లుదయనేసి సేయుమా యంబుజాక్షి.

మీన- తే.గీ. దీనిఁగొని దేవపురమందుఁ దిరుగుటరయ
నీదుటింకునుజాటించు నెవమురాదె
ముందువెన్కలఁజూడక మొదటఁజెప్పి
పిదపఁజింతింపఫలమేమి మృదులభావ.

కాశి- చ. తనయునుజంపనామనము
తద్దయునొప్పదుకాన నల్వురన్
జనుపథమందు వీడుదము
స్వామిదయామయుఁ డాస్మెరొంచునీ

యనుఁగుఁగుఃహాగి భూమినిఁ జి
రాయురుపేతముగాఁ జనించి వృ
ద్ధినిఁగనుఁగాత క్షాత్రికుల
ధీరుఁడు పెండిలి యాడుఁగావుతఁగ.

మేన- క. కడుపునఁ బుట్టిన బిడ్డను
విడనాడుట కష్టముండు విపినంబులలోఁ
బడవైచుట రాక్షసకృతి
చెడుదయ్యము బిడ్డ కట్టి చేయఁగనూర్పెన్.

కాశి- తే.గీ. విధినిదూరఁగనేల యీబిడ్డ కట్టి
లోపముండదు బ్రాహ్మణశాపముండు
ప్రేమఁబెంచెదరువారు వన్ని కార్య
వైభవంబులఁదీర్చెడు వనితపొమ్ము.

గద్య.

ఇతి శ్రీమదాత్రేయసగోత్ర కాశినాథుసివాంశోద్భవ లింగ
యారాధ్య కాంతమాంబికాతనూజ వీరమల్లయారాధ్య
మాచమాంబికాదత్తపుత్ర బాపయవ్యావహారిక
నామధేయ వీరమల్లయాభిధేయవిరచిత మే
నకా కౌశిక సంవాదంబున సర్వాం
బును సంపూర్ణము.

---

# ప్రకటన.

## ఆంధ్ర దేశీ భాగవతము.

౧. పండిత దాసు శ్రీరామామాత్య విరచితము. ఇది మృదుమధుర శైలిలో వ్రాయబడి ౧౨౦౦ పుటలును ౧౨,౦౦౦ పద్యములును గలిగి గిల్టు అక్షరములతో సిల్కు క్లాతుతో బైండు చేసినది.

వెల ప్రతి ౧కి రు 4-0-0 పోస్టుఖర్చులు కొనువారే భరించవలెను

☞ ఈ గ్రంథము బెజవాడ వాణీ ప్రెస్‌లో దొరుకును.

